దతోడ భూరివత్సుస్త్రన,స్ఫురణతోడ॥ ౧౭౫ ॥ మిగుల నడతెంచు కై
లాస,నగమనంగ । దనరి పదహతిఁ ద్రవ్వుచు,ధరణితలము। మొగము
వంచుచు భీకర,ముగను రంకె । వైచి గుప్పించు నందికే,శ్వరుని నెకిఁ।
౧౭౬ ॥ శా ॥ వెన్నుండీమెడఁజేయు మాయల మరుల్,విశ్వేశునిఁ జేర
కుం । డ న్నేర్పొప్పఁగ బ్రోవనొకఁడ నిరూ,ఢప్రక్రియన్ నేనయో
రన్నాచాలుదు మీరలేలయనుమీ,రాలాపము ల్మీఁ ఱఁగా। సన్నాహంబున
గొల్చిరాఁగఁ బ్రమథుల్,సర్వజ్ఞుఁ డానందుఁడై॥ ౧౭౭ ॥ మ ॥ విభవం
బొప్పఁగ నృత్తగీత కలనా,విస్ఫూర్తిఁ జే దేవతా । ప్రభుకన్యల్ సను
ర ముంగలనిజ,ప్రస్థాన భేరీ మహా । రభసంబై శివదుందుభు ల్మొఱయ
హో, రాళంబుగా దేవది । గ్విభు సంస్తవ్యత రాత్మ చర్య కథనా,
ర్భూత లీలారతిన్ ॥ ౧౭౮ ॥ గీ ॥ వెడలి కక్ష్యాంతరముల న,వ్వేళమ
త్తి । మండపంబుల కడనుండి,మహితవిభవ। మెసఁగఁ జనుచుండి స
లోక్య,లెల్ల ఖచర । వాసులప్పుడు నేత్రోత్స,వముగఁజూడ॥ ౧౭౯॥ సీ
గొప్పలై మిన్నందు,చప్పరంబులుగల తన్ముక్తిమంటప,స్థలులనుండి। శృ
గాగ్రసీమల,శృంగార విహరణ శ్రీసమాకృతినున్న,చేడెలెల్ల । కఱక
తు గమనసం,గతులన్ని వీనుల విందుగావిని తమ, డెందములను ।
దిమేమిపని శివుం,డీవేళ దలకొన్న కార్యంబు మిగుల వెం,గలితనంబు
౧౮౦ ॥ గాక పదివేస ములమాయ,కానిమాయ । జోటిమేటితనవ
జూటి,పాటిరూఢి । గాదు పగవాఁడు వెడవిలు,కాఁడువాని । మాఁ
డునుమాఁడు దీర్చుఁబో,మాడునేఁడు॥ ౧౮౧ ॥ మ ॥ అనవించున్ శివ
డంచిత ప్రకటమా,యారూపశృంగారిణీ । ఘనలీలాకృతిఁ జూడఁగా
దికి వే,డ్కల్చాల రెట్టింపనా । కనకాగార విచిత్రగోపురసమ, గ్రః
శ్రీ రథ్యాయుతలె । ల్లను దోడ్తో నయమందుడై గడచి హో, లా చి
పద్మంబునన్ ॥ ౧౮౨ ॥ మ ॥ అహిరా డ్భూషణుఁ డార్యకాత్మ
గశృం,గాభ్రాంకషంబౌ నభో । లహరింగాంగ సరిజ్ఝరీకక్రీమ విలా

లచ్ఛాఖి శాఖాశిఖా । విహగానేక వినోదము ల్బలుమరున్,పిఠింపఁ
గాఁ బలుకుచున్ । బహుదంతి ద్యుతిగర్భ దుర్భరదరీ, భాగంబులన్
జూపుచున్ ॥ ౧౮౩ ॥ చ ॥ నయమొనరన్ బరంబరులా,నర్పఁగ సిద్ధు
లు వేత్రహస్తులై । ప్రియముదలిర్ప యక్షసుర, బృందములున్ దగనా
డి.గేఁదులున్ । రయమున వెంటరాఁగ ముని,రాజులు కిన్నర గుహ్యకా
దులున్ । జయజయశబ్ద గుంభనలఁ, జాలభజింపఁగ నిండువేడుకన్॥

—(*) శివుండు భద్రవటంబున విడియుట. (*)—

సీ ॥ మురజవాదిత్ర గో,ముఖముఖ నాదముల్ మలసిన గిరిగు
హా,ల్దాలుమొలయ । వైడూర్యగోపుర,ద్వారము ల్వెలువడి బలువైన
ప్రాకార,పఙ్క్తి గడచి । మెల్లన మగరాల,మెట్లపై వడినెక్కి తిన్న
గా డిగ్గుచు,దివ్యమైన । నవరత్నమయ తోర,ణంబులు గలచక్కి దప్ప
క చక్కని,దారినడచి ॥ ౧౮౪ ॥ కమ్మ విరివాసనలమొమ్ము,గమ్మినెమ్మి।
తనువులకు హాయి యొనరింపఁ,దామసింప। కరిగి విడియఁగ మదిగోరి,
యప్పురారి । దంబు రహిమీరి భద్రవ,టంబుఁజేరె॥౧౮౫॥

—(*) సూర్యాస్తమాన వర్ణన. (*)—

క ॥ అప్రౌఢచ్ఛట నుచిత । వ్యాపారక్రియలవిడిసి,రందఱుతమ
కున్ । వైపైనలిలఁ బడమటఁ । జూపట్టెన్ మందరశ్మిఁ,జొప్పడి రవి
యున్ ॥ ౧౮౬ ॥ మ ॥ పరమేశుం డిటులద్రినందనయు ది,క్పాలుర్ము
ను ల్సిద్ధులున్ । సురలున్ సాధ్యులు కిన్నరు ల్ప్రమథుల, స్తోకప్రభన్
గొల్చితో । నరుదేరన్ జనుచుండి భద్రవట ర,మ్యస్థానుఁడై వశకా ।
హరిదశ్వుండ పరాబ్ధిఁజేరె హరిరూ,పానంద సంధానుఁడై ॥ ౧౮౭ ॥
చ ॥ ఘనతరదీప్తితోఁ దనువి,కాసినిగా నొనరించు లోకలో । చనము
పరాగయోగమున,సాంద్రితదారుణ కాంతినొందినన్ । గనుఁగొని ప

ద్రినీలః న,గ్రకటాన ఘూత్కరణంబు సేయుచో । లీక నిదన నెమ్మొగం
బు ముకుళించెఁ జలించె రథాంగ సంఘముల్ ॥ ౧౮౯ ॥ చ ॥ సముదు
భటుఁడు పూర్వనగ,సానుతటంబను కొత్తళంబునన్ । బ్రిమదముమీర
నిల్చి యాల, పాపపుఁ జీకటి సోకు మూకపై । నమరవశి స్నిగుడ్చిన
వి,యన్మయమైన పిరంగి గుండునన్ । గమలహితుం డఖండగతి, గ్ర
క్కునఁ బశ్చిమవార్ధిఁ గ్రుంకినన్ ॥ ౧౯౦ ॥ మ ॥ క్షితిసర్వజ్ఞుఁడనంగఁ
బేరయినయా,శ్రీకంఠుఁ డార్యాసమ । న్వితుఁడై నీదగు మోహినీత్వ
ముగనన్,వేంచేయుచున్నాఁడుచో । ద్గతి మీరన్ పురుషోత్తమాఖ్య ల
సిప,ల్కన్ బోవు నల్లైక్రియా।హతభానుం డపరాబ్ధిశాయిఁగనఁజే,
రంబోయె సన్మిత్రుఁడై ॥ ౧౯౧ ॥ గీ ॥ మిత్రతేజంబు తనుగూర్చి,మెచ్చి
యపర । దిగ్వధూటికి బడబాగ్ని,తెల్విసోఁగు । తాపితాచిర య
నఁగ న,త్యంతశోణ। కాంతి పడమటసంధ్యరా,గమువహించె॥ ౧౯౨ ॥
సీ ॥ పరధరాధరభృగు,ప్రాంతకాంతారైక దావపావక శిఖా,తతియ
నంగఁ । బతదంశుమత్ప్రభా,హతిసముద్ధూతాబ్ధి రత్నపుంజోజ్జ్వల,ర
శ్మియనఁగ । సారతరంగిణీ,సలిలపానోజ్జృంభి తౌర్వానలజ్వాల,కౌశ
మనఁగ । బటు మహానటజటా,పటలవిస్ఫుటశేష ఫణిఫణామణిగణ,ప్ర
భలనంగ ॥ ౧౯౩ ॥ యామినీ కామినీహృద,యానురాగ । ముగను
మయూను చరుఁడాగి,గగనచత్వ । రమునఁ గుంకుమరేఖల,కొమరు
ర్చె । నమర ననఁదగె సంధ్యరా,గములగములు ॥ ౧౯౪ ॥ గీ ॥ ప
తమునఁ దన్నుఁ గెల్వనే,ర్పరియటంచుఁ । బూనివచ్చెడు గట్టుని, లా
నికెదిరి । నిలిచె నోమరుఁడనఁగ ద,న్నీలదేహ । కఠిన కాంతుల వ
నుజీ, కటులు బలిసె ॥ ౧౯౫ ॥ గీ ॥ భువనములకంట నలుమగాఁ,బు
నివేదక । విన్న కంచము గదియునా,వేళసాంధ్య । రాగదీపము నీ
పవి,చిత్రముగను । గాటుకయనంగ గటికచీ,కటులు పర్వె ॥ ౧౯౬
చ ॥ పరగ మరుంఘుపెన్ దొంగ తు,పాకిని బుప్పొడి మందు తేఁటిగుం

డురువుగ మిఱఁగూరిచద,లోదవు గుంటగఁజేరి రుద్రుఁడన్ । హరిణము
నేయఁ గల్వవిరి,యందపు జానకి తాటఁగోపవ । హిన్నరవులుచన్ మి
ణుంగురుల,నీతి నభస్థ్సలిసిండెఁ దారకల్॥ ౧౯౭ ॥ గీ ॥ చెలఁగుచు ను
ద్ధతిన్ సమయ,సింహకిశోరము వేడ్కమీఱఁగా। నలగఁగనాటవీ విలసి,
తాంధతమః పటలీభకుంభని । దళలనమొనర్చి నల్గడల,రాజిలఁగా వె
దఁజల్లినట్టియు । జ్వలతర మౌక్తికావళుల, చందమునన్ బొడసూ
పెఁ దారకల్ ॥ ౧౯౮ ॥ మ ॥ అవటవృక్షసీమను స,మహాతలంబున
నిష్టగోష్ఠివి । ద్యాసిభవప్రమోద మహి, తామిత వాక్పణిత ప్రసంగ
నా । నావిధరీతులన్ నిజమ,నఃప్రియ సంగతు లుల్లసిల్లగాఁ । గేవల
మైత్రితో **సుఖము**, గీలొగ్గనఁగా శయనించె శర్వుఁడున్॥౧౯౯॥

—(*) చంద్రోదయవర్ణనము. (*)—

చ ॥ పరమ మునీంద్రులెల్లను ద,పఃక్రమ భూరి సమాధియోగ
ముల్ । పరిగొని యోగగానిదుర,పట్టిక యాకటనున్న దేవతల్। నిరు
పమభోగసంస్థితుల నై,కొలనఁ దూర్వనుభాను పంచునా । పరసపు
బోనపుట్టికన, చంద్రుఁడుదోఁచె సుధామరీచియై॥ ౨౦౦ ॥ సీ ॥ గగనా
టవీతార,కా మృగంబులనేలు కొనవచ్చు సింగంపుఁ,గొదమయనఁగ।ఘు
నతరయామినీ,కామినీ కర్ణైక విలసితరత్నకుం,డలమనంగ । సకల శ
కుంతసం,చయ భాసుర చకోర కులతపో యోగస,త్ఫలమనంగ। బూ
ర్వాచలప్రాంత,భూమితలోజ్జ్వల న్మంజుప్రవాళని,కుంజమనఁగ॥౨౦౧॥
నలఘుతరదీప్తి మండలం,బతిశయిల్లఁ । దనరఁగోకీ నికాయంబు,తల్లడి
ల్లఁ । గుముద వనసంతతులు చాలఁ,గొమరుమిగులఁ। జంద్రుఁ డుద
యించెఁ గాంతిని,స్తంద్రుఁడగుచు ॥ ౨౦౨ ॥ క ॥ ఖరకర కిరణ స్ఫుర
ణన్ । బరితప్తంబైనజనము,పై వీవఁగసుం। దర రజనీకరమునఁదగు।
సురటియనన్ చంద్రుఁడలరె,చూపఱకిమ్మై॥ ౨౦౩ ॥ క ॥ ఇరులనిమొదు

శైవాలో । తక్కరములఁ బెనగొనిన ధవళకరసారనిసాం । కుర వి
భ్రమోజ్జ్వలామృత । సరసియనం గగనవీధి,చంద్రుండలరెన్ ॥ ౨౦౫॥
అట్టియెడ ॥

—(*) చంద్రాస్తమానవర్ణనము. (*)—

గీ ॥ అంధకవిరోధి చనఁ దమం,బడర బలిమిఁ । గలసితద్రాక్ష
యుగ్రత,గల్గనోడి । యోహటించెనో యల్లుడం,చూహతోడు । పడ
గఁబోయిన గతిని శా,పతియుఁ గ్రుంకె ॥ ౨౦౬ ॥

—(*) ప్రభాతకాలవర్ణనము. (*)—

గీ ॥ చంద్రు నస్తమాన, సరణిని గైకొని, చక్కఁబొడిచివచ్చె,
దిక్కులందుఁ । బక్షి కలకలంబు,బలుపయియప్పుడు । భవుని పయన
మునకు,బటువుగాఁగ ॥ ౨౦౭ ॥ క ॥ రాతిరి గడచినయట్లు ప్ర । భా
తంబై మిగుల నమర,పతి దిశబ్రహ్మం । బై తెల్విబొదల సూర్యుఁడు ।
దోతేరఁగ నందరెలమి తో,మేల్కనుచున్ ॥ ౨౦౮ ॥ క ॥ కాలోచిత
కృత్యంబుల । హేలాగతి సల్పివచ్చి,యీశ్వరు మోలన్ । లీలఁజెలు
వొంద నిలిచిరి । శ్రీవెలయఁగ సురలు మునులు,సిద్ధులనంగన్ ॥ ౨౦౯ ॥
క ॥ తరువాతి కథా క్రమమది । నిరుపమవాగ్విమలవృత్తి,సేర్పొప్పఁ
గమా । కెఱిఁగింపుమనుచు నడిగినఁ । బరమోత్కర్షంబు గాఁగఁ,
బ్రోద్ధిదలిర్పన్ ॥ ౨౧౦ ॥ శా ॥ దేవబ్రాహ్మణ భక్తియుక్తి ఘన బుద్ధి
ప్రాభవా కాంచన । గ్రావాధీశ్వర ధైర్యసార విలస,ద్గాంభీర్య పా
థోనిధీ । శైవేయ ప్రతిమానశౌర్యతర దే,శాధీశ కోటీర ర । త్నా
విర్భావ మహాప్రభాంఘ్రియుగ వి,ద్యాభోజ రాజేశ్వరా ॥ ౨౧౧ ॥
క ॥ విలసిత సద్గుణసాంద్రా । వెలుగోటి కుమారయాచ,విభుగర్భసు
ధా । జలరాశి పూర్ణచంద్రా । బలవద్రిపు గజమృగేంద్ర,భాగ్యసు
రేంద్రా ॥ ౨౧౨ ॥

మాలిని.

సవితృ సదృశ తేజో,జాల నిత్యత్వశీలా । కవి వినుత చరిత్రా, గాఢ సౌందర్యగాత్రా । భువన భరిత కీర్తీ,పుణ్యసాధ్గుణ్యమూర్తీ। దివిజ తరుసమానా, దీన విద్వన్నిధానా ॥ ౨౧౩ ॥

గద్య.

ఇది శ్రీమ ద్దత్తాత్రేయ గురు చరణారవింద మకరందబిందు సం
దోహ నంది మానసేందిందిర భద్రకాళీ వర ప్రసాదిత
కవితా చమత్కార కుమారయాచ నృప దత్త తికరా
జ్య నామాంతర భాసుర రోసనూరి లింగనా మా
త్య పౌత్ర గంగన మంత్రి పుత్రి కాశ్యప గోత్ర
పవిత్ర వజ్రకంకట వికంకటమతి వేంకటపతి
కవి ప్రణీతంబైన విష్ణుమాయా విలాసం
బను శృంగార ప్రబంధంబు నందుఁ
ప్ర థ మా శ్వా స ము
సంపూర్ణము.

శ్రీ ర స్తు.

# శ్రీవిష్ణుమాయావిలాసము

## ద్వితీయాశ్వాసము.

క॥ శ్రీరోసనూరి భూపతి। గౌరీశ దయానులబ్ధ,కామితఫ లశృం
గార వెలుగోటికుల బం । గారేచ నృపాలచంద్ర,గమన మృగేంద్రా
౧॥వ ॥ అవధరింపుము ॥ క ॥ దేవా జనమేజయ ధా । త్రీవల్లభ కర్ణ
ములకుఁ,దెందేపలుగా । శ్రీవా క్సుధారసము చూరఁ। గా వైశంప
ాయనుండు, ఘనముగఁ బలికెన్ ॥ ౨ ॥ ఇట్లు ॥ సీ ॥ ప్రాచీదిశాభామ
ఫాలభాగంబున దీపించు సిందూర,తిలకమనఁగఁ। దూరుపు కొండపై
గైరికస్థలమున నైరావతము పెట్టు,నడుగనంగఁ । బూర్వసముద్రంబు
పొంతసంభవమయ్యెఁ బోదలెడు పగడంపుఁ,బోదయనంగఁ । బరవే
శ్వరున కింద్రు,పంపున దేవతల్ గొనివచ్చు కెంపుల,గొడుగనంగ॥ ౩।
సూర్యుఁ డుదయింప నిబ్భంగి,శూలినిత్య । కర్మములుదీర్చి పైనంపు
టాతురమున । గౌరితోఁ గూడి ప్రమథసం, ఘములు సురలు । మా
నులును గూడి చనుదేర,మహిమమీర ॥ ౪ ॥ క ॥ అలబలము గాఁగ
దన్నున్ । గొలుచుచు వెనువెంట వేగఁ, గూడియు మునులున్ । గఁ
సురలు నడువ మరివా । రల మన్నించుచును వేడ్క, రంజిల్లంగన్ ।
౫ ॥ క ॥ శ్రీ వైకుంఠ పురమునకుఁ । ద్రోవం జేకొనుచుఁ దగుని,రూఢి
ని గౌరీ । దేవి యొడగూడ నిపుణము । గా వృషభా రూఢుండగుచు,
గమనోత్సుకతన్ ॥ ౬ ॥ గీ ॥ పొద్దుపొడుపున నవరత్న,భూరిరత్న
కాంతి కాంతంబుగాఁబహు,కళలఁ దనరి । మిక్కుటంబుగ మెఱయంగ,
దిక్కులెల్ల । నాత్మ కత్యంత హర్షమ్మె,యనువు మెరయ ॥ ౭ ॥ మ ।
అలకానాథు నిజాప్తగణాదుల నసే, కాపూరణ వస్తుస్థితుల్ । కలితా

ట్టాలక వేశ్మ గోపుర సమ, గ్రశ్రీ సువర్ణోజ్జ్వలో । త్పల సౌగంధిక రత్నచిత్ర కమల,ప్రాచుర్య కాసారసీ । మలు శృంగారవను ల్విమానములు ధా,మశ్రేణులెల్లన్ వడిన్ ॥ ౯ ॥ క ॥ గిరినందనకల్పవటతరు। వరసవిధ స్థలవిచిత్ర,వైఖరు లంతః । కరుణ తగఁజూపి చెప్పుచుఁ । గరమొప్పవహింప వేడు,కన్ బోవంగన్ ॥ ౧౦ ॥ శా ॥ యక్షాధీశ్వరుఁ డిష్టసౌష్ఠవసము,ద్యద్భక్తితోఁ గానుకల్ । నిక్షేపంబులు మున్నుగాఁగ నెదుటన్,నిండారఁగా నిల్పి ఫా । లాక్ష శ్రీపద పంకజంబులకు న్నెయ్యంబొప్పఁగా మ్రొక్కి-నన్ । బక్షంబైన కృపాకటాక్షమున సం,భావించి వీడ్కొల్పుచున్ ॥ ౧౧ ॥ గీ ॥ సరస కర్పూర కదళికా,ఖండచైత్ర । రథ వనోద్యాన ములవిచి,త్రములు సర్వ। మంగళాస్పదముగ సర్వ,మంగళకేళిఁ । గించి పలుకుచు సకలేశుఁ,డంచితముగ ॥ ౧౨ ॥

—(*) శివుం డమరావతిం గనుట. (*)—

చ ॥ చనుచును ముందటన్ గనియె,సారసచక్ర సరోవరంబులన్। ఘనఫల పుష్పపల్లవని,కాయ సురద్రు వనాళి వజ్ర కే । తన పరిఖాభిరామమణి,ధామములన్ గమనీయ రత్నశో । భనబహు సౌధ యూధముల, బంధుర సుందర మైతనర్పఁగన్ ॥ ౧౩ ॥ క ॥ గోపురమిట్టాల మందిర । గోపుర నవరత్నఖచిత,కుట్టిమవిభవ । శ్రీపరమా నమరావతి । నాపరమేశ్వరుఁడు చూచి,యతి కుతుకమునన్ ॥ ౧౪ ॥

—* నందనవన వర్ణనము. *—

క ॥ నందనవన కల్పద్రుమ । బృందంబుల నీడఁ జనుచుఁ, బ్రియమెనయన్ బా । లేందుధరుఁడు హిమగిరిరా । ణ్ణందనకిట్లని యెంబ్రియము,నన్ హిత మొదవన్ ॥ ౧౫ ॥ ఉ ॥ చెంగలిచూపులన్ బ్రియముసై, పుఁగ మెప్పగుచున్న తమ్మితూం । డ్లంగొని ముకురాలం గొటికె, డగ్గరియిచ్చు ప్రియాంగనావళిన్ । బొంగుచుఁ గాఁగిలించుచు వి,నోదము మీరమరాళ దంపతుల్ । గాంగ తరంగ డోలికలఁ,గామిని యూయ్యెల

లూఁగుఁగంటివే ॥ ౧౬ ॥ ఉ ॥ చన్నులు చక్రవాకములు, సైకత భూ
లము ల్పిఱుందులున్ । గన్నులు గండుమీనులు ము,ఖంబులు నీరజ బృం
ము లుక్కురుల్ । చెన్నగు తేఁటిగుంపులు వ,శిత్రయ మూర్ములు గాఁ
జేజెరా । యన్నులొయారపున్ సరసు,లై తగి యొప్పట చూడు కో
మలీ ॥ ౧౭ ॥ వ ॥ అనియిట్లు ముక్కంటి గట్టురాపట్టి వాల్గంటిమిన్న
మిన్నగల దిట్టతనంబున తనముందటన్ బెట్టికొని పట్టు దప్పని పైనం
న కూర్కొని కొనియాడందగు శ్రేవలఁ గేవలంబయిన తావులుంగల త్రో
వలఁ గంపింపఁ బెంపైనకొమ్మల జొంపమ్ములందగు వనమ్ములమీఁదిన కీ
శారికా మయూరకుల సమాకుల రావమ్ముల కిమ్మైన ఫలదళ కుసు
విసర ఫలిత నానా లతావితాన నితాంత మాలతీ మాకంద బృంద కు
రువింద పిచుమంద జంబూ జంబీర నింబాశ్వత్థ కర్పూర కదళీ రసా
సాల తక్కోల తాల హింతాల వకుళ వంజుళ కురువక మరువక
న్మథ మధూక మంజుళ పుంజ రంజిత మరుసంతాన గురు తరాంతర
నర్గళ మార్గంబుల హేరాళఘారాళ హేలావిలాస బంధురమదసింధుర
బులమాడ్కిన్ జనుచునను చుఁ బ్రియంబుననయంబున డెందంబున కాన
దంబు సందడింప నిందుమౌళితోడ వేడుక గులుకన్ బలుకు పలుకుల
ప్రింపు పలుకులం దొలుకు తీపు దళుకొత్తు తేనియల్ గులుకరించు భా
షించు కలభాషిణి మధురంబగు నరుణాధరం బారం దీరం బండి ని
డు దొండపండనుకొని యొంటొంటిన్ గూడుక తండతండంబులై చు
చుఱుక్కునన్ గరువతనంబునన్ రాఁగని రాగనిమగ్నంబగు సల్కు
లుకున నక్కన్నె రాచిలుకల పిలుకలఁజే విదిర్చి పేర్చిన చేర్చిన మందం
మదంబున నత్తరుణి, తరుణ కర పంకజంబు లరుణ కిసలయంబులని మె
వ నుల్లంబులు పల్లవింప వడి గడలుకొనఁ దొడిబడ నాహారంబుల న
హారవాంఛలు పెనంగొన బెగ్గడిల్లకఁ బెల్లుగావచ్చు పిక నికరమ్ముల
కలభావమ్ములు బ్రియంబునఁ దెలియఁబలుకు బ్రియుని కులుకు పలుకు

కుఁ గలకలనగు చంద్రముఖి ముఖ మండలంబు చంద్రోదయంబుగాఁ ద
లంచి కలంచిన మనంబుల ఘనంబుగ ముందుముందుగ విందు లారగిం
తుమను చందంబుల తెందేపలై మువ్వంపు నవ్వులన్ మూఁగి పండువె
న్నెల బువ్వ కడుపులనిండ మెక్కఁ గలిగెనని దవ్వులనున్నవారి దవ్వులం
బెట్టి క్రొవ్వారందిట్టి వేగంబు నివ్వటిల్ల రండని కోరిక లీరికలెత్తం బిల్చి
డగ్గరన్ మేరమీరం జేరి వెంట నంటివచ్చు చకోరికల సాకెకుంజూచు న
మ్మృగీవృశచూపుల దాపుల కోపుల యోపికల్ గల్గి చెవులురిక్కించి ని
క్కిచూచుచు భయభ్రాంతిచే దాటుదాటు లేడిగుంపులం గను వేడుక
కూడిన జాడలం దలయెత్తు నయ్యాలివేణి కప్పుగుప్పు పెన్నెరిగొప్పు కొ
ప్పున నెప్పుమరి మెప్పు చొప్పుప్పతిల్ల దిట్టపట్టంబుగాఁజుట్టిన కమ్మవాసన
ల విరుల సరులఁ గమ్ముకొని దళమ్మగు తావులన్ దావలంబయిన గుణం
బుల గమకంబులుగాఁ దెలుపం బోలుపై గమ్మన నేతెంచు తెమ్మెర పి
న్నవాని మన్నెతనమ్ము బురుణించి ఘనమ్మగు నెమ్మలన్ గరుణించి యు
రువడించి ముదమ్ము బెరయ మదమ్ము నెరయ ఝుమ్ముఝుమ్మనన్ గ్రమ్మి
గ్రిమ్మన సడతెంచు నెల తేఁటికులమ్ముల మొత్తమ్ము లమించు మించుల
మించు సురుములతోడి మేఘమ్ములను చాపలమ్ముల యెమ్మునఁ బురులువి
ప్పినటించు నెమ్మిగములం గాముఁకమ్ములం గాంచుచుఁ దత్త త్సరోవ
రంబుల వారిమీరి బిసకాండంబులం బారి సమరి ఖండించి చంచుపుటమ్ము
ల దిటంబుగా కబళించ గళవళించు జాలపదంబులు వీకం గూకలిడు త
త్కలకలం బాలోకింపుచు॥ ౩౦ ॥ ఉ ॥ తమ్ముల యిమ్ములం దనుగ, త
మ్ముల నామ్ములనున్న తేఁటిమొ। త్తమ్ముల ఝంఝుమన్ మొరలు, దా
ర్కొని యక్కలహంసనాదముల్ । గమ్మగఁ గమ్మ వాసనలు, గమ్మనఁ
దూటుచు వచ్చువాతపో। తమ్ముల సోకులందు గుమ్ము, దమ్ముల హాయని
సేద దేరఁగన్ ॥ ౩౧ ॥ చ ॥ అటనట విశ్రమించుచు మహాతపమా త
తమైననోర్చిచ । కటికల నాగమందు జన, కన్గొనిపలుకై వెలుఁడి

రెండుమి। కుటిలముగ దొడ్డతెల్లగల,కూరిమి రెక్కల పక్కి నెక్కియు। క్కట గలయంగ సుగ్రుడధి,కత్వరతఁ గమియింపుచుఁ దరిపెఁ॥ ౩౨ ॥

— ※ శివుండు పాలసముద్రముం గనుట. ※ —

సీ॥ అటువలె వలిదిబ్బ, యాల్లుండు వైకుంఠపురము చేరువగాఁ గఁ,బోవుచుండి। యెలమితోఁ దనకును,దలపుష్ప మొలవంగఁ జేసి ఘనజ్ఞుఁడై,చెన్నుమెఱసి। మినువాక మొదలగు, మేలైన యేఱుల గములకు మొదలను,క్రమముగాంచి। పదినూరు కన్నుల,బాబెక్కియాడెడు చక్కని గనిసము,త్సాహమెనసి ॥ ౩౩ ॥ దచ్చి పూనిబ్బరపుడబ్బు,బొబ్బి మెకము। నుబ్బు సిబ్బెంపు వెలిమబ్బు, నబ్బురంబు। పసిడి బొజ్జయ్యనడకైన,పక్కి నిక్కు। గడలుద్రోయంగ గలుగుపా,లకడలిజూచి॥ ౩౪॥

— (※) శివుండు పార్వతితో క్షీరసముద్రాదిగత విశేషంబులు చూపి చెప్పుట. (※) —

సీ॥ గౌరితో నిట్లను,కాంత యల్లదె కంటె యనతి దూరమున దు,గ్ధాంబురాశి। హరి యిల్లటపుటల్లుఁ,డమ్మేచు దనకను కరణి నుబ్బెనోనాగ,ఘనతరంగ। గణములు మిన్నందఁ,గనుపట్టె నాదండ వెలిదీవి గనుగొంటె,వేల్పులెల్లఁ। దన్ను మథించంగ,వెన్న దేలినది పెనుదిబ్బ వైచినట్లోనరె చూడు ॥ ౩౫ ॥ కాంత కనుగొనుమట్టె చెం,గటను మెట్ట। తమ్మివలెను వైకుంఠపు,రమ్ము వెలసెఁ। గోటకొమ్మల తమ్మిరే,కులుగనమరి। యున్నవనిచూపి మఱియున,య్యుగ్రుఁడనియె॥ ౩౬ ॥

సీ॥ ఇందిందిరాలక,యిమ్మహా నగరంబు విభవంబు కలదెల్ల,వినుతి సేయ। నస్మదాదులకును,నాదిమ ఫణికైని కమల గర్భునకైన,క్రమము చిక్క। దిందిరా రమణుని,మందిరద్వార సీమకు రాజవీధియా, మాగఁ మతివ। నారాయణుని పెద్ద,నగరి చేరువనదె మకరకేతనకాంతి,మలసి మిగిలి ॥ ౩౭ ॥ గెంటకున్నది రసదాడి,వింటివాని। ఇల్లుచూచితె ముందర,నిందువదన। శారికాకీర కలకంఠ,చంచరీక। మోహన బలంబు

ల్లసు, మోహరించి ॥ ౩౮ ॥ క ॥ ఉన్నట్టి చందమిప్పుడు । వెన్నుని పె ను ప్రాపువలన, వెడ విలుతుండు బలో । సన్నాహంబున నాపై । మున్నిటితన సూడుదీర్ప, మొనయుట దోచెక ॥ ౩౯ ॥ వ ॥ అని యిట్లు పలుకుచు ॥ మ ॥ రవిచంద్రాగ్ని విలోచన క్రమత శ్రీ, రంజిల్లగా నమ్మహా। శివుడయ్యార్యకు నేత్రపర్వముగ ల, క్ష్మీవల్లభో ద్యత్ప్రరో । త్సవ శృంగార కళావిలాసములు త, త్తద్వైఖరుల్ నందునం । దు వినోదంబులం జూచి చెప్పచును సం, తోషాతిరేకంబునన్ ॥ ౪౦ ॥

...※ శివుండు విరజానదిం గాంచుట. ※...

సీ ॥ మందార మాకంద, సుందర వనబృంద సీమ సుగంధముల్, సేవింపంబోలయు । శీతలచ్ఛాయల, శివుండును శివయును సర్వసుపర్వులు, సకల సిద్ధ । సాధ్యాదులును మును, ల్సపరివారముగాంగ జనిచని ముందట, గనిరి వేడ్క । నమృతంపుం దరగల, నలరుచుం గెందమ్మి తళుకుల కెంపు చెం, గలువ గములు ॥ ౪౧ ॥ దనరు నీలంపుం జేటిమొ, త్తముల బెరసి । కలిత కలహంస జలవిహం, గముల కలక । లార్భటుల్ గల్గి రత్నము, యప్రభాభి । రామ సోపానమై నవి, రజయనునది ॥ ౪౨ ॥ అలర మరియును నచ్చోన, నంతటాను । శ్రీవిలాసంబులైన స, రోవరములు । తనుచునై సర్వ గరుడగం, ధర్వ దివిజ । యక్షముని సేవ్య భవ్యమై, యతిశయిల్లి ॥ ౪౩ ॥ సీ ॥ అవిరళస్నాన సం, ధ్యాది క్రియాచార నిష్ఠావనీసురా, న్వితతటము । లతులిత భాగవ, తాథన్ ప్రసంగవిస్ఫుట సుధీజనవచ, స్స్పందనములు । జలచర చక్రాంగ, సారంగ బకవిహంగమసంగతతరంగ, సముదయములు । ఫుల్లహల్లకసితాం, భోజకైరవచరచ్చంచరీకారవ, సంకులములు ॥ ౪౪ ॥ కలితవిద్రుమ సోపాన, విలసితములు । గరుడ గంధర్వ కిన్నర, ఖచర నికర । వినుతమానస కాసార, ఘనవిలాస । రుచిర విభవంబులగు తత్స, రోవరములు ॥ ౪౫ ॥ మ ॥ కమలాబ్జ స్ఫుటచక్ర ధారణమునన్, గాంభీర్య శోభాయుతిన్ సుమన

స్తుత్య శిఖిముఖోన్నతజన, స్తోమాహిరా ద్వైభవ । క్రమరీఢిన్ ధ
రణీసురాభినుత సౌ,కర్యాను భావంబునన్ । గమనీయంబగు శార్ఙ్గ
పాణి కరణిన్, గాసారము ల్చెల్వగాన్ ॥ ౪౬ ॥ గీ ॥ అట్టికాసార తీ
రమై, యలరు విరజ । మహిమ మాద్యంతమును సర్వ, మంగళయగు ।
గౌరి కేర్పడఁ బల్కుచుఁ, గాలకంఠుఁ । డా సమీపాంతరము జేరు, నవ
సరమున ॥ ౪౭ ॥

—(*) నారదుండు శివునికంటె మున్న వైకుంఠంబునకరిగి హరిఁగనుట. (*)—

సీ ॥ అందనంతంబైన, హరిభక్తి పరులును బరమయోగీంద్రులు,
భాగవతులు । నతులితవినయవి, శ్రుతలీల చిత్తులై వేడ్కతో దినమున,
విరజగ్రుంకి । సంధ్యాజపంబులు, సలుపుచుఁ దమమనో భీష్టంబు లీడేరఁ,
దుష్టివొందల । ననుపమమణిభూష, ణాంబరా డంబరులై విష్ణు సేవిం
ప, నలరుచుందు ॥ ౪౮ ॥ ఆటుల గావున నారదుం, డపుడు వేగ । నవ్వ
నముదాటి మునుమున్న యా, విరజను । నిత్యకర్మంబు లాగిదీర్చి, నిష్ఠ
మెఱసి । హరిని సేవింప వైకుంఠ, పురముఁజొచ్చి ॥ ౪౯ ॥ క ॥ కుడిచే
ల మహతి కుడిమెడఁ । గడుసిడుకొని యెడమచేత, ఘనకుంచికనున్
దొడిబడ విసరుచు వలయము । గడలఁకొనన్ దిరిగి కుప్పి, గంతులు గొ
నుచున్ ॥ ౫౦ ॥ క ॥ హరికడకు నరిగె మున్నగ । హరుఁడాత్తఫలము
లపాంత, కరిగియు విరజన్ । సరసుల నన్నిటఁ గలయన్ । దిరిగివలయు
విధులు తాను, దీర్చి యంతన్ ॥ ౫౧ ॥

—(*) శివుండు వైకుంఠనగరంబు సొచ్చుట. (*)—

శా ॥ శ్రీవిశ్వేశుఁ డనంతభూషణుఁడు గౌరీ దేవితోఁగూడి తా
నావేళ న్విరజానదీ మహిమమ, ర్మ్యోచోట్ల సంధిల్లుత । చ్ఛ్రీవిస్ఫూర్తిన్
విశేషసంగతుల న,ర్థిన్ గౌరికిన్ జెప్పుచున్ । దేవోత్తంసుఁడు విష్ణుదే
వుపురమున్, ధీయుక్తితోఁ జొచ్చియున్ ॥ ౫౨ ॥ క ॥ నవరత్న ఖచిత

కాంచన । భవనంబులు సేయ గరుడ, పావన కుముదా । శు విజయ జ
య కుముదాది । ప్రవరుల కిరవైన మందిరములవి గనుచున్ ॥ ౫౩ ॥
క ॥ తోరణ బహుళము లగుచును । వోరణములు వెలసి సర్వతోముఖ
భద్రా । గారముల నెరయ హరిపురి । గౌరవమునం జొచ్చి చనుచు,
గారుడ రుచులన్ ॥ ౫౪ ॥ చ ॥ పరగు మణిప్రతానముల, బల్వగు కోట
ల పెంపు రత్నసుం । దరతర గోపురంపుజిగి, దాల్చిన సౌధములున్న సౌం
పుత । త్వరమతి నొక్కటన్ దెలియ, బద్మదళాక్షు పురంబ దెల్లం దా ।
నరయుచు హేమచిత్రభవ, నాంగణ సీమ లతిక్రమించుచున్ ॥ ౫౫ ॥
క ॥ హరిపెద్ద హజారము కడ । కరిగి యువాహనము డిగ్గి, నభవుని కట
మున్ । త్వరితగతి నారదుండు శుభ । కరమతి నటము న్నె వేగ, గమ
నస్ఫూర్తిన్ ॥ ౫౬ ॥ చ ॥ పరిఖలు కోటలున్ గడచి, బంకుల కావలివా
రి మీరి సుం । దర నవరత్న మందిరవి, తానము లెల్ల నతిక్రమించి ము ।
ప్పిరిగొను భక్తిం జక్రధరు, పెద్దహజారము చెంతజేరి శ్రీ । హరి కమ
లా సమేతుండయి, హాటకహర్మ్యము మీద వేడుకన్ ॥ ౫౭ ॥ గీ ॥ నృత్త
గీతవినోదము, ల్నెరయంగనుచు । వినుచు నొకవంక నిందిర, వెలందిపిం
డు । రవ్వతనముల మురిపెము, ల్నివ్వటిల్ల । మీరి దుగదచ్చి యుత్తిక, బా
రయనుచు ॥ ౫౮ ॥ శా ॥ జూదంబాడంగ నొక్కవంక కొలువై, సుజ్ఞా
నలోకక్రమ । ప్రాదుర్భావవిదుండు నుండంగని తా, త్వర్యంబు సంధి
ల్లంద । త్పాదాంభోజయుగావనవందనమొన, ర్పన్ నారదున్ జూచి
ల । క్ష్మీదేవీ ప్రియవల్లభుండు కరుణా, శ్రీదోపంగా నిట్లనున్ ॥ ౫౯ ॥

——*నారదుండు విష్ణుతో శివుండాడిన హెచ్చుమాటలనుడువుట.*——

సీ ॥ కూర్చుండుము నారద, గుణగణ్య త్రిభువన సంచార మాయాం
దుం, జాలభక్తి । గలవాండ వాదుగా, గరళకంధరు సమ్ముఖమున కెన్నం
డైనం, గడగినీవు । పోయినయదిగల, దాయేమి మాప్రసంగములందుం
గలవేని, కలిగినట్టి । గతులెల్ల దెలుపుమా, గౌరి మ్మాయక్క నా యంద

లి దనుచు నెట్టు,లనిన నపుడు ॥ ౬౦ ॥ దేవమాని తదాజ్ఞను,స్థితిగఁగు రు । చుండి బహుసన్నుతులుచేసి,పుండరీక । నయన కైలాస మునను డి,నయముమీర । వచ్చితిని నేను మీపద,ద్వయము గొలువ ॥ ౬౧ ॥ క శంకరుఁడు సకలలోక శి । వంకరుఁ డఖిలంబు గొలువ,వైభవలీలన్ బొంకముగ నిండు గొలువై। సంకీర్ణంబుగను నుండు, సమయమున దున్ ॥ ౬౨ ॥ సీ ॥ చని యయ్యుమామహే,శ్వరుల సందర్శించి య న్నశ్రీకంఠుఁడు,నన్నుఁజూచి । బిసరుహాక్షుఁడు సుధా,రస మనిమిషు కుఁ బెట్టిన విధమెట్లు,బట్టుగిట్టి । దనుజులు కలహింపఁ,జనకనివ్వెరప బలహీనులైయున్న,భంగియేమి । కతమున నయ్యెఁద,త్క్రమమెఱిం నఁజెప్పు మనిననప్పరమేశ్వ,రునకు నేను॥ ౬౩ ॥ విన్నవింపంగఁ దలఁ స,విస్తరముగఁ । దోయజాక్షుఁడు హరిముకుం,దుఁడు సమస్త । ల కమోహనుఁ డాసురా,నీకములకు । నమృతమీయంగ శ్రీరూప,మది రించె ॥ ౬౪ ॥ మ ॥ తన శృంగారముఁజూచి దానవులుచి,త్తభ్రాంతి జెందంగనూ । తనసౌందర్య వయోవిలాస రతికాం,తారత్న మాట సుధా । శనులై రెల్ల సురల్ తదాకృతిగనన్,సర్వేశమీరైననున్ । నవిలాసిని యుపద్రవంబులను నా,నాచిక్కులన్ బొందరే ॥ ౬౫ ॥ క మీరెంతవారు హరిశ్వం । గారశ్రీవిధముకన్ను,గవ కడ్డపడన్ । మారు విరిగువియలప । ల్గారున్ మొత్తబడకుండు,మహిమ దనర్పన్ ॥ ౬౬ క ॥ అనవిని కోపము గదురఁగ। ననుగినిసిసభన్ననుండ్ర,బ్రహ్మాయజ జు । లరనునాడె వింటిరేముని । వనితను హరిఁజూచివిరతి,వదలుదు నుచున్ ॥ ౬౭ ॥ అని ॥ క ॥ ననవిల్తు గొంగపలుకన్ । మొనసిన చిఱ నవ్వ గౌరి,ముఖపద్మమునన్ । గని శివుఁడును బ్రమథులతో। ననుఁజు వుచుఁ దనమహాగు,ణ బ్రకటముగాన్॥౬౮॥ మ ॥ అవిచారుండయిన విషాశనుని మా, యాభేద్య నత్యంతదు । ర్భవదూరున్ మరి మృత సంహారునిబ,లప్రాపహున్ సర్వమా। భువనాతీతు నమేయు నీశ్వ

జగ,త్పూర్ణున్ మహా దేవునిన్ । శివునిన్ జుల్కఁగనిట్లు వల్కిన సుర,ర్షిన్ శిక్ష సేయందగున్ ॥ ౧౯ ॥ మ ॥ అనినన్ భృంగి రిటాదులా ప్రమథులు,ద్యత్క్రోధులై వేగమే । ననుబట్టంగఁ గడంగునయ్యెడ ననూ,నంబైన కన్ సన్న వా । రినివారించి హిమాచలంబునను గౌ,రీయుక్తు సన్ జాలఁ బ్రా । ర్థనగావించినఁ జక్రమిచ్చి జగద,త్యద్భుతత్వముం జేసి యున్ ॥ ౨౦ ॥ ఉ ॥ మాయలు మంత్రము ల్సకల, మంత్రము లందుల తంత్రముల్ మహో । పాయుల నస్త్రశస్త్రములు,పాటిఁగ చూటి యు నేర్పరించి దై । తేయుల సంహరింపఁ దగు,ధీయుతుఁ జేసితి నేని నాతఁడున్ । స్త్రీయయినన్ భ్రమింతునని,చెప్పెదవీవు వివేకసారమే॥ ౨౧ ॥ క ॥ నిను నెఱుఁగ వెదిరి నెఱుఁగవు । వినుమీ నీవగన్ నెల్ల, విధములఁ జెలఁతున్। జను లెఱుఁగ విష్ణుమాయా । వని తాత్త్వముఁ జూచి విరతి,వలఁతిగ నగుచున్ ॥ ౨౨ ॥ చ॥ పరువడి నష్ట నావిరతి,భావము నీవును సర్వమైనయీ । సురలు మునీంద్రులున్ దెలియఁ,జూచెద రెంతయు వింత గాఁగను । త్తరమిది నీవు పల్కనకుఁ,దక్కుమికన్ వెడమాట లీవుము । స్నెరుగక నాడుటన్ మరిస,హించితి మించగ నాడకీవిఁకన్॥

—※హరిహరులకుఁ గలహంబుగల్గు మాటలు నారదుం డాడుట.※—

ఉ ॥ మంచిది మోహినీ యువతి, మాధవుఁ గమ్మను చూడవచ్చెదన్ । బంచశరుండు నన్ గెలుచు,భంగి యొనర్పుము వేగ పొమ్మనీ । వంచితలీలతో హరిమ,హత్వ మెఱింగినవాఁడ వాటచేఁ। గాంచెదనమ్మ త్తరిజ,గద్విదితంబగుఁ దారతమ్యమున్ ॥ ౨౪ ॥ చ ॥ అరయక నీవ్రనన్న భువ,నాధికుఁ జుల్కఁగ నాడితౌగదా । మరవక పొమ్ము నీమది,రమాపతి వేగమె మోహనాకృతి । స్థిర తరుణిన్ స్థితిన్ దగిలి,శేషత నన్ బ్రమయించినన్ గదా । నిరుపమ సత్యశీలుఁడవు;నీవు మునీశ్వర వేయు నేటికిన్ ॥ ౨౫ ॥

—* శివుండు వచ్చుచున్నాండని విష్ణుతో నారదుండు నుడువుట. *—

క ॥ అనినన్నుం గినిసి శివుండొ । య్యనవా శ్రీగౌరి వలవ, దనినన్
వినకా । వనితామణితో నిటకుం । జనుదెంచె సమస్తమానిజనపరివృ
తుండై ॥ ౭౬ ॥ క ॥ తనయులు ప్రమథులు దిక్పతు । లనిమిషు లర
దేరవచ్చె, నాగడ పరుపన్ । నినునినునంగనగమ్మని । తనదైన విర
లోక, తత్తిక్కెటింగింపన్ ॥ ౭౭ ॥ క ॥ అనునంత ద్వారపాలకు । లనఘ
పరా కబ్జనాభ, హరుండిదె చనుదెం । చినవాండు హజారముకడ । కన
తెల్పంగ నెదురుకొనుట, కై శ్రీహరియున్ ॥ ౭౮ ॥

—(*) విష్ణువు శివు నెదుర్కొనుట. (*)—

సీ ॥ మోదంబుతో లేచి, మేదినీ రమణియు మఱువులందీయర
మావధూటి । వలకేలు భుజముపై, నలవడ గ్రహియించి దాస దాసీ
జనుల్, తరుచుగొల్వ । కుముద విష్వక్సేన, కుముదాక్షులొకట హె చ్ఛ
రికలు సలుపంగ, చక్రగదలి । యందందఁ దగువార, లలబల ముడుఁ
చు నుపచారములం జేయు, నుచితలీల ॥ ౭౯ ॥ బంగరరిగెల నీడ సం, భ్ర
మముతోడ । వచ్చునటమున్నె శివుండుత, ద్వారసీమ । ప్రమథపరివృ
తుండగుచుం బా, ర్వతిని గూడి । యచటి మొగసాల గడచి నె, య్యమున
లిర్వ ॥ ౮౦ ॥ క ॥ అరుదెంచు నంతలోన । ట్లరుదెంచుచు నెదురుడ
సి, హరి కరమర్థిన్ । గిరిసుతం బూజింపంగనిం । డిర పొందొనరం
పన్మ, తిని బుచ్చితెగన్ ॥ ౮౧ ॥ చ ॥ పరమమునీంద్రులున్ బరవ, భా
వతు ల్నిజభక్తకోటులు । గ్గరుడుం డనంతుండున్ మొదలు, గాంగలవా
తోడనప్పుడ । ట్లరిగి యెదుర్కొనెన్ శివు, మహామదమొప్పంగం గా
లించెనా । హరు పరిరంభణ ప్రకట, మహాణముగా మునుదాను గా
చియున్ ॥ ౮౨ ॥ క ॥ నీలాచలరాజము స । త్కైలాస నగంబు గ
యు, గావచ్చె నెడన్ । శ్రీలలనేశుండు హరియున్ । శూలాయుధుం

వృషు గదిసి,శుభకరమతులై ॥ ౮౩ ॥ గీ ॥ పరమ సంప్రీతిఁ బొదలిర,ప్ప ట్టునందు । కలిమి గుబ్బెతగుబ్బల,నలరుకమ్మ। కస్తురి విలాసవాసనల్, గలిగి వెలయు । వెడఁదయురమున శ్రీహరి,వేడ్కనిట్లు ॥ ౮౪ ॥ మ॥ హసునింపారఁగ గౌఁగిలించి కడును,దృఢభక్తితో మ్రొక్కెనన్। సురనాథాంబుజ సంభవాదులమునిస్తోమంబులన్ సత్కృపా । కరదృష్టిన్ వెలయంగ జూచె రమచే,గౌరీమహాదేవిక। హారతిన్ బూజలుచాలస ల్పరమణీ,సుప్రక్రియన్ గూర్చియున్ ॥ ౮౫ ॥ చ ॥ ఇటుల పురాణదంపతుల,నింపలరన్ సమయోచితక్రియా । ఘటన లమించు పూజనల,గౌరవమున్ మెఱయంగఁజేసియు । కటబహు వాద్యరావవితత స్తుతి పాఠక వందిమాగధా । ర్భటమగు క్రందసంగబహు,భంగిగ వేడుకలుప్పతిల్లఁగన్ ॥ ౮౬ ॥ సీ ॥ బంగారుచాలుకంబములను మణి హేమ శిఖరకుంభములఁ,జెన్ను మెఱసి । గరుడకేతనమహా,తరటమయి జిగియించు తళుకుటద్దంపుగోడల దనరిన । పెనుపొంద నవరత్న,పీఠంబులవహించి గచ్చుటరుగుల ముద్దు,కల్మిఁ బెరసి । ఘనతరంబగు మేలు,కట్ల రంగుచెలంగి కుసుమతల్పంబుల,కొమరు మిగిలి॥ ౮౭ ॥

—(*) శివుండు హరి సభాస్థానంబుఁ జేరుట. (*)—

కలితమగు ధూపవాసన,ల్గలసికమ్మ । విరుల ఘుమఘుమంబగు పట్టి,విశదక్షజని । వాసమునకా భవునిగొని,వాసవాబ్జ । భవముఖాదులు వెంవెంట,బలసి నడువ ॥ ౮౮ ॥ సీ ॥ సముచిత గతిఁదదా,స్థానమంటపముప్రవేశించి యందఱ,వేరువేర । నహాసనముల సు,ఖాసీనులైయుండ నియమించి తానును,నిజసమంచి । తాసనంబున నుండి,యప్సర స్త్రీసతతి యాటలుపాటలు,నభినయములు । భాగవపత్రిముఖుల,ఫణితులజ్జాసన శతమఖ కిన్నర,సాధ్య సిద్ధ ॥ ౮౯ ॥ గరుడ గంధర్వ గణములు;కానకలోసఁగి । విన్నపము సేయు మనువులు,వినుచుమనుపు । మన్ననలుగల్గి శ్రీహరి,యున్నతరిని ॥ ౯౦ ॥

—* హరి హర సంభాషణ. *—

ఉ॥ తద్దయుఁ దానువచ్చిన విధంబది మున్నె యెఱుంగు జాణ తోఁ । బ్రొద్దు మెరుంగునుఁ గడకు,బొమ్మనుపుట్టుము గల్గువానితో నొద్దిక మాటలాడుటకు, నూహదలిర్ప సభాస్థలంబు పెౕ । గద్దుడు గంగచేసయిగ,సల్పి సమున్నతి నప్పుడెంతయుఁ॥౯౧॥ క॥ శంకరుఁ డభిముఖుఁడైయా । పంకజనేత్రునకు మృదుల,పద్ధతినను ని । శ్శంకుఁ డయి నారదుఁడునను । గొంకక నిందించె నిందు,గొలువున నిన్నుఁ॥ ౯౨॥ క॥ దానవకోట్ల భ్రమింపఁగ । మానినివై నట్టినీను,మతకరిమా యల్ । నేను గనినంత మరులను । బూనుదుఁ బ్రాకృతునివలె,బుద్ధి చ లింపఁ॥ ౯౩॥ క॥ జ్ఞానముచెడి భువనాధిక । మానంబుడివోవమ రుసు,మక్రమ శరసం । తానములఁ నీడితుఁడనై । నేనిను బతిమాలు దునట,నీరజనాభా॥ ౯౪॥

—* మోహినీరూపంబు శివుండు చూడంగోరి విష్ణునడుగుట. *—

గక॥ నావైరాగ్యం బతనికి । నీవిశ్వంబునకుఁ దెలుప, నెంచిన మతితో । నేవచ్చితి నిటకన్నీ । స్త్రీవిధమరయంగనిప్డు,సిద్ధము గాఁ గఁ॥ ౯౫॥ చ॥ మొనయుము నాటినీభువన,మోహన భామిని రూ పమిప్పుడే । కనుఁగొనవేడ్క యయ్యెడిని,గంజభవాదుల కద్భుతంబు గా । నినుఁగని నేవిరక్తమతి,నిల్చెద నారదమౌని చిన్నవో । యిన మ దితోడ సిగ్గువడ,నీయెడనో దశరూప ధారణా॥ ౯౬॥ చ॥ మరునిఁగ యించి మృత్యువుఁ బ్ర,మత్తవిధం బుడిగించి లోకభీ । కర గరళంబుమ్రిం గి మురఘస్మర నీవెనుగఁ జగత్ప్రసిద్ధినేఁ । బరగిన నన్నొకం డనుట పాడియె కామినిగమ్ము వేగమే । గుచుకొని తళుక్కు నీకులుకు, గుబ్బలు నిక్కఁగఁ జూచి మెచ్చెదఁ॥ ౯౭॥ గీ॥ అనిన మందస్మితాననుఁ,డగు చుమదిని । బుండరీకాక్షుఁ డనుమాట,పొలుపుదక్క । యరుణ కవ లాక్షుఁ డనునట్టి,పెరవుగఁ బుగ । నెలమిఁ దనలో వితర్కించె,నిట్టులన

చు ॥ గా ॥ క ॥ నారదుఁడు లోకసామితె । గారూఢిఁ బలికినంత,
కనలొందం గాఁ । గారణము తనకు నేమిటి । నేరంబిది మది విచార,
ణీయము వలదే ॥ గా ॥ తే ॥ ఆవిలాసిని రూపుమీ,రమరఁగనిన । బ్ర
మయుచురటన్న మాటమా,త్రమున కలిగి । కోపగించిన నది తన,కొద
వగాదె । తలఁప సర్వజ్ఞుఁడను పేరు,గలుగుచోట ॥౧౦౦॥ అనియిట్లు ॥
శ్రీ నిత్యాత్మకుఁ డంతరంగమున నెన్, జింతించి రౌద్రాకృతిన్ । గా
నం డేమియుఁ దాకుతప్పితఁడహం,కారాత్ముఁ డెల్లప్పుడున్ । గానీ యి
ప్పుడు మంచిమాటలవిప,ల్కన్ ధిక్కరించెన్ వగల్ । పూనన్ వెన్క
ను జూతమీతని ఘనం,బున్ బెంపు సొంపారగన్ ॥౧౦౧॥

—(*) శివునితో విష్ణుండు మోహినీరూపంబు తమరు చూడవలదనుట. (*)—

చ ॥ అనిమది చింతచేసి త్రిపు,రాంతకుఁ జూచి మురారి పల్కె
నె । మ్మనమున వేడ్కఁగూడ జను, మానముతో నను జూడవచ్చిద । ర్మ
నమొగిఁ బల్చనాక్రియల,చక్కటి గల్గినయట్టి పట్టియై । పకికిటు సో
చ్చినంత నగు,బాటుబు మాటలు వేయునేటికిన్ ॥ ౧౦౨ ॥ క ॥ నాద
గు వనితారూపము । మోదముతో నీకుఁజూడ,ముచ్చటగలుగన్ । వా
దింప వలవదిఁక మ । ర్యాదం జను మిప్పుడు చూడ,నగుఁద శైలైన్ ॥
౧౦౩ ॥ క ॥ ఇంకొకవేళను నస్మ । త్పంకజనయ నావిలాస,పరిమా
కృతిని । శ్శంకుఁడవై కనియెదు శివ । శంకర శైలేంద్ర చాప,సర్వజ్ఞ
హరా ॥ ౧౦౪ ॥ క ॥ నాయింటికి విచ్చేయుట । శ్రేయస్కరమయ్యె
నిన్ను,సేవించితి ల । క్ష్మీయుతుఁడ నగుచు నీవ్రన్ । హాయిగనీ యిం
టికరుగు,ముని హరి పల్కెన్ ॥ ౧౦౫ ॥ ఉ ॥ ఇందుధరుండు విష్ణునకు, ని
ట్లను నూరక మాయమాటలన్ । బాదిలిఁబెట్టగాఁ దగదు,పంకజనాభ
మొయారి యాడురా । పందముగాఁగ నాయెదుట,నైయిపు డేమొగి
నిల్వ చూచెదన్ । బొందుగ నీదుచిన్నెలగు,పోలిక చాలక పెక్కుమా

టలన్ ॥ ౧౦౬ ॥ క ॥ అనికినరా వాడమి శివుఁడనఁ । గను ప్రమథులు భృంగిరిటులు,కడుఁ గ్రూరముగా । వినవింతలగు దురుక్తులు । గొన కొని పలుకన్ సహించు,కొని శ్రీహరియున్ ॥ ౧౦౭ ॥ మ ॥ ప్రమదాకారముఁబూని తేఁపితని గర్వక్రౌర్యముల్ వాయఁగా। భ్రమఁబొందింపక యుంటినేని ప్రమథుల్పాపాత్ములై రేగి దే । వమునిన్ సంకట పెట్టకుందురె మనో, వాక్కాయ కర్మంబులన్ । విమతుల్ క్రూరతి మత్సరస్థులనియు,విష్ణుండు పల్కెన్ శివున్ ॥ ౧౦౮ ॥ ఉ ॥ మాన్యుఁడ వంచు నిన్నుఁ బలు,మారు నుతింపుచు నుండలీల సా । మాన్యముగా వచింతు నను,మానమొకింతయు లేక నీకునున్ । దైన్యము దెచ్చువద్దు వినఁ,దల్పవొ మంచిది భాగ్యమాయె నిం । కన్యవిచారమేల కుసు,మాయుధు కార్యమె చక్కనయ్యెడున్ ॥ ౧౦౯ ॥ క ॥ అనిబయలు మెఱయఁ బలికిన । వనజాక్షుని పలుకులకును,వనజభవాదుల్ । మనమున నట్లని తలఁచిరి । ఘనులీ హరిహరులు మతుల,గతులెట్లగునో ॥ ౧౧౦ ॥ క ॥ హరిమాయదగిలి భ్రాంతిన్ । హరుఁడాసర్వజ్ఞు మహిమ,లారఁడి బోవన్ । మరుబాములను దలంకునొ । పరమవిరక్తిన్ బ్రతిష్ఠ,పడుఁడో నొకదా॥ ౧౧౧ ॥ క ॥ అనికొందరనిరి వీరల । ఘనతరబహుమాయలెట్లు,గనఁగా వశమా । మనకిపుడు తనకు దానే । కనఁబడునటుపొందం జూడ,గలమది యెల్లన్ ॥ ౧౧౨ ॥

— ❊ విష్ణుండు మోహినియై శివునికి గన్పట్టుట. ❊ —

చ ॥ తమకఁగనేల యుంచునుము,దంబెద నిండగ నుండు నయ్యెడన్ । గమల దళాయతాక్షునిమొ,గంబునఁ దిన్నని నవ్వొలర్చిన। న్గమకముకల్గి పేరెముల్,గైకొని పారఁగ వేళయుంచునా। సుమశరుఁడు గుఱ్ఱమైయడరి,శూరతఁ జూపఁగఁ బ్రాభవంబునన్ ॥ ౧౧౩ ॥ సీ ॥ ఆసభనున్నవా,రతి చంచలాత్ములై యందరు మిగులమో,హముల భ్రమయఁ । జనువఁబోయినతొల్పి,చదువుల కటమున్నె దాటకునదన నా,స్త్రంబుదో

ప। నఖిలజ్ఞు లగువారి,కైన నెరుకచెడి ముక్తి కాంతామణి, మోము
వంప । మందహాసాననా,నందుఁడై హరియోగ మాయనాకర్షింపఁ,
జేయనపుడె ॥ ౧౧౪ ॥ గుబ్బ తిలవాసనలతోడి,గుబ్బలాడి । తనముద
గుదారి గలనెర,తనముమీరి । తర్పితానంగ మోహనా,స్త్రం బనంగ ।
నిగుడి శివుబ్రోల నెలఁతయై,నిల్చి పొలిచి ॥ ౧౧౫ ॥ సీ ॥ శ్రీవత్స లక్ష్మం
బు,చెలఁగి కొప్పున సుప్పతిల్లంగఁ గౌస్తుభ,దీప్తిమోవి । కడనిల్వ శా
ర్ఙ్గాంబు,కటిఁదిక న్నాభులందు చెలువందఁ గాంచన,చేలమెరుగు । తను
వునఁ బ్రకటింపఁ,దగు పాంచజన్యంబు సొగసు కంఠమునందుఁ, జొప్ప
డంగఁ । జక్రమహత్త్వంబు,జఘనసీమ నటింప మీనావతారమై,మెరయు
కన్ను ॥ ౧౧౬ ॥ గవయు మీగాళ్ళ తామేటి,గతులు గుల్క । వెన్నుఁ
డను తెల్విఁ గనఁడాయె,విష్ణుమాయ। ప్రకటమయిడాయ తనమహో,పరి
భవాయ । నజ్ఞుఁడైయిట్లు శివుఁడుస,ర్వజ్ఞుఁడయ్యు॥ ౧౧౭ ॥ సీ ॥ ఘం
టల మొలనూలి,ఘణఘణల్ పాదనూ పురముల రవళితోఁ,బూనికలయు।
పైతాణి చెరఁగులో,పలితోడల్వలి పెంపుఁ జెంగావిపావడ,రంగుగాఁగ।
మొగమున కెగయుచ,న్నానలపై నరుణోష్ఠ సుద్యుతి కుంకుమ,సుంకుజే
య । పదియారు వన్నెయుఁ,బసిఁడి మట్టెలడాలు చలువకుచ్చుల కంచు,
జరతజూప ॥ ౧౧౮ ॥ నడబెడంగున కంచలు,కడుముదమున । విడువకె
ప్పుడు కాళ్ళను,వేళ్ళఁ బెనఁగ । మరుని కైనను దనసొంపు,మరులమెంపు।
కొమ్మయైయొప్పి యొప్పుల,కుప్పయగుచు ॥ ౧౧౯ ॥ సీ ॥ నెరిగొప్ప వి
రుల పెక్,బరిమళంబులు దేఁటి గుంపుల విందుకై,కోరిపిలువ । ముంగు
రుల్ గ్రమ్మిన,మురిపెంపు నుదురల్లి కటిమబ్బులోఁ జంద్ర,కళను నవ్వ ।
మకరికా పత్రముల్,మదనాంక మగుచున్న మకర కేతనకాంతి,మరుపొన
ర్ప । మొగము చేరాజున,కొగి నేత్ర లలితకై రవముల జిగిచామ, రము
లుగాఁగ॥౧౨౦ ॥ గలికి నిడువాలు గన్నుల,కైపుకొలువు । వారలకువి
రి తూపుల,వానగాఁగఁ।గళకు వజ్రంపు కమ్మల,తళుకుచెకుఁ । ఉద్దముల

మెఱుంగు బెళుకయి, ముద్దుమిగుల ॥ ౧౨౧ ॥ సీ ॥ నెరిసీటు గంద క్రొ, న్నెరి నామము బెడంగు మొగమున కెగయుచ, న్నొనలరంగు । సొంపైన కెంపుచే, ర్పుకర నిక్కు మెరుంగు పంజులకమ్మల, ప్రభ వెలుంగు । గండ స్థలంబులఁ, గాంతులీనగ పొంగు కలిగిన ముక్కు–ముం, గర తెరంగు । నా ణెము త్తెపు కుతి, కంటుచెల్వు చెలంగు వెడకడమృగనాభి, మేలిభంగు ॥ ౧౨౨ ॥ అమర శృంగార మోహిని, యైనమంజు । వాణి పూబోణి నలి వేణి, వనజపాణి । సైకతశ్రోణి గసభ్రిమ, ల్పందుకొనఁగ । నెరుకలెల్లను నుడివోవ, నెల్లవారు ॥ ౧౨౩ ॥ చ ॥ కులుకు నొయారమా రజము, కూ రిమిమాటల నీటుపాయముల్ । గలకల నవ్వుచెల్వమును, గర్వపు మేని మెరుంగు రంగుచి । న్నెలువలపంద చందముల, నిగ్గునొకాటపు సిగ్గు జ గ్గుతోఁ । గలికితనంబునన్ సభకుఁ, గానఁబడన్ దమకంబు పెంపునన్ ॥ ౧౨౪ ॥ సీ ॥ కొమ్మ గాదిది పైడి, బొమ్మని యొకకొంద రనబొమ్మ గాది ది, యల్ల మెరుగు । ప్రోవన్న కొందరు, బారి మెరుంగుల ప్రోవు గాదిది చం ద్రిని, కళయటంచు । కనికొందరన చంద్ర, కళయుఁగాదిది రతి చేసున్న మల్లెపూ, చెండు తెలియు । నానని మరికొంద, రన మల్లెపూచెండు గా దిది మరునిచొ, క్కటపు మోహ ॥ ౧౨౫ ॥ నాస్త్రమని కొందరననిట్టు, లనువుమెఱసి । సమధికంబైన తేజమ్ము, నమున నెరసి । వెలయు నామోహ నాంగిచె, ల్వఁ గఁజూచి । కోర్కుల్ లెదనిండ సభగనుం, గొనుచునుండ ॥ ౧౨౬ ॥ మదకుంభి కుంభదేశము । వదలక దిగజారు మదము, వైఖరిద గియా । సుదతి కుచకుంభ యుగళా । స్పదమైయారొదవె రుచిర, సంప త్కరమై ॥ ౧౨౭ ॥

— (*) ప్రమథులు మోహినిఁజూచి వలచుట. (*) —

క ॥ తగనిటుల భువనమోహన । మగు రూపున విభ్రమింప, నందరు నానా । వగలన్ మరుబాములచేఁ । బొగలఁగన వ్వేళఁ బ్రమథ, పుంజంబెల్లన్ ॥ ౧౨౮ ॥ చ ॥ తమతమ ప్రజ్ఞలన్నియును, దప్పఁగ ధైర్య

ము క్రౌర్యముల్చేడక । గమకమడంగఁ దెల్పి దొలఁ,గన్నహూ మోహ
ము సంఘటిల్లఁగా। భ్రమతరుచై తమింగొలుపఁ,బల్మరు వెట్టితనంబు లే
ప్పడక । సుమశర తాడనంబులను,సుక్రిక సభాసదులెల్ల నవ్వగన్ ॥
౧౨౯॥సీ ॥ ప్రమథుఁ డొక్కండొక్క,ప్రమథుఁ దద్భామగా భావించి
గడ్డంబు,పట్టితివియు । భ్రమగొని యొకరుద్ర,భటుఁడొక్క శివదూతఁ
గాంతగాఁగనుఁగొని,కౌఁగిలించు। మరియొక్క శైవుండు,మామహేశ్వ
రుసేవ కుని బడంతిగనెంచి,వెనగఁబోవు । భవు భృత్యుఁడొక్కండు,
పసిడి కంబపు బొమ్మఁ గొమ్మని ముద్దాడుఁ,గోర్కిమెరయఁ॥ ౧౩౦ ॥
బట్టి యిటువంటి భంగుల,బెట్టివిష్ణు । యోగ మాయ విలాసమ,య్యావి
దమైన । కారణంబున నప్పుడ,క్కజముగాగ । విరహి సివమెత్తి తెలి
యక,వెనుకముందు ॥ ౧౩౧ ॥

—❋ శివుండు మోహినింజూచి మరులొక్కనుట. ❋—

క ॥ మరుచిలక పఠాణియనా । నొరపున్ శృంగారతయును,
నొప్పగు సొగసున్ । గఱదల పొంకము మురిపెపు । నెరతనము స్నిఁక
మపుడు,నేత్రగతంబై ॥ ౧౩౨ ॥ చ ॥ చురచుర గాడగా నతెవ,చూపుల
నన్దగు మోహనాస్త్రముల్ । కరకరి కోటిమన్మథు,లఖండ పరాక్రమ
బెలఁజేసిన । ట్లురువగు గుండె ఝల్లనగ,నొక్క ట బాయగ ధైర్యమెల్ల
ద । త్తరమునఁ దానువచ్చినవి,ధంబెద గానని చిత్తవంతతోన్॥౧౩౩॥
చ ॥ అనుపమశీలి శూలితన,కైన వివేకము జ్ఞానమున్ఘనం । బును బ
హు శౌర్యసారము ప్ర,భుత్వము తత్త్వము తెల్వి గోల్పడన్। మనసిజ
బాణభిన్నతర,మానసుఁడై తనలోన దాను న । వ్వఁత విలాస వైఖరు
లు,వణాన జేసెను బెక్కుభంగులన్ ॥ ౧౩४ ॥ శా ॥ నారీరత్నములన్
జగమ్ములను నెన్నన్ జక్కగా వింటిఁ గ । న్నారన్ గన్గొని యున్న
వాఁడఁగదయీ,యబ్జాక్షి యొయ్యారము।య్యారే యేజవరాండ్రకు న్గలు
గగా,దౌరౌర యీయింతియ । య్యారే లక్షవరాలు సేయు నిపుడా,
హాయియాహా లింకేటికిన్ ॥ ౧౩౫ ॥ గీ ॥ చాఁగురె విలాస మజ్జరే,చక్క

దనము । మాయురే యారజంబుని, మ్మానవతికి । నెవ్వఁడోపతి పేరే
మొ, యెచటనుండి । యిటకువచ్చెనో ప్రేమన, న్నేలుకొనదొ॥ ౧౩౬ ॥
సీ ॥ చిమ్మ చీఁకటియొప్పుఁ, జిలుకు తుమ్మెదకప్పు గప్పునీజవరాలి, గొప్ప
కొప్పు । మంచిదామరగోము, మించు వెన్నెలగము నామకోనౌనునీ,
లేమమోము । కమ్మ బంగరునిక్కు, చిమ్మునద్దపుటెక్కు హొక్కుగాని
క్కునీ, యతివచెక్కు । లగును చక్కెరదీవి, చిగురులై యెలమావి తీవి
నైయె యాతన్వి, కావిమోవి ॥ ౧౩౭ ॥ గట్టుపోఁడిమిగను గను, పట్టుదీని ।
చన్నుకట్టునఁ దమిబుట్టు, నెన్నవన్నె । గన్న నీచిన్నె లాడిచ, క్కనగు మే
ని । మించు తొలకరి మించాక్రి, మించిమించు ॥ ౧౩౮ ॥ అనితనలోదా
నూహించి ॥ క ॥ మరులు మదినించు మోహము । కరకరిఁ దమకించు
లేవ, గా గమకించున్ । ఇరుగడలం గురిగాంచున్ । తెరిగాదంచు న్దలం
చుఁ, దమిమరలించున్ ॥ ౧౩౯ ॥ ఉ ॥ జారు పయింటలో గులుకు చ, న్గ
వపైఁ గొనగోరులుంచగా। గోరు నాయారిచూపులల, కోర్కులు డెంద
మునందుఁ గుప్పగా । గూరగ జెగ్గడిల్లితమి, గొల్పుచుఁ దేనియలూరు
మోవిపై । తీరగుపల్లు కెంపులుగ, దింపగ సొంపుగలోన నెంచుచున్॥
౧౪౦ ॥ చ ॥ కనుగొనఁ గొంకు వేడుకలు, గన్పడఁజూచిన మోము ద్రి
ప్పునో । యనుభయ ముప్పతిల్ల మొన, యున్నిటు పిల్చిన బల్కకెక్కు
డన్ । జనునాయటంచు బిల్వనకు, జంకును దత్తను సుందరంబుగ। ల్గని
తనుగన్న మెచ్చదను, కైవడిఁ గాయము మాటు సేయుచున్ ॥ ౧౪౧ ॥
వన్నెవితరిఁ నీడ సభ, వారు గనంగను ముచ్చటాడగా । గన్నను చా
టూకించక నిట, గన్నను సన్నకుసన్న గాగనీ । కన్నుల కల్కి నల్కకొ
ని, కౌగిటఁజెప్పు ప్రియంబెలర్పనే । నున్నతి మోహముప్పతిల, నోకట
నుక్ రతికేళిఁ జేలనే॥ ౧౪౨ ॥ క ॥ ననువంటి రసజ్ఞునికీ । వనితామణి
దారికెనేని, వలపునిగుడరో । మ్మునగ్రుచ్చి కౌగిలింపుచుఁ । గొనకొని
రతికేళినేలు, కొననేబాళిన్॥ ౧౪౩ ॥ గీ ॥ చులుకగానన్ను గొలువెల్లఁ,
జూచుచున్న । నలిగి నాతోడఁ బార్వతి, పలుకకున్న । విన్ననైయున్న

బ్రిమథులు, వెన్నుఁడింతె । యుగ్రుని గురుత్వ మనియన్న, నుండనిమ్ము ॥ ౧౪౪ ॥ క ॥ చిన్నెలు వన్నెలు గలయా । చిన్నారి మెఱుంగుబోఁడిఁ, జిక్కించుకనే । మన్నన నేలకయుండిన । మన్నా నాజన్మ మేల, మరిబ్రతుకేలా ॥ ౧౪౫ ॥ వ ॥ అనియిట్లు శంకరుండు మోహినీదేవిం గాంచి మన్మథబాణ పీడితుండయి యువ్విళ్ళూరుచున్నంత ॥ ౧౪౬ ॥ క ॥ ఆవలికథ నెఱిఁగింపుము । నీవాక్సుధ గ్రోలు తలఁపు, నెక్కొన మదియెంతో వేఁడుచున్నదనిరా । జావైశంపాయన ముని, నడిగినయంతన్॥౧౪౭॥శా॥ శ్రీసర్వజ్ఞ కుమారయాచ పృథివీ, భృత్పుత్రదీనావనా । ధీసంపజ్జిత దేవతా గురువరా, ధీరాగ్రగణ్యామహా । రాసక్రీడ పరాయణాచ్యుత సదృ, గ్రాజత్సుఖా స్వాదనా । నాసత్యప్రతిమాన సుందరతనూ, నారీమనోవల్లభా ॥ ౧౪౮ ॥ క ॥ శ్రీవీరమాత పౌత్రా । భూవర సంస్తూయమాన, భూరిచరిత్రా । భావాళీ పుంజాన్విత । భావజరిపు దైవరుచిర, పద శతపత్రా॥ మాలిని ॥ విమల గుణనిధానా, విక్రమారోపమానా । నముచిదమనభోగీ, నవ్య సంగీతరాగీ । శమిత రిపు సమూహా, శాంతవిద్యా విమోహా । సముచితపద వేదీ, సంచితా గామి భేదీ॥

గద్య॥ ఇది శ్రీమ ద్దత్తాత్రేయ గురు చరణారవింద మకరందబిందు
సందోహా నంది మాన సేందిందిర భద్రకాళీ వర ప్రసాదిత
కవితా చమత్కార కుమారయాచ నృప దత్తతికరాయ
జ్వ నామాంతర భాసుర రోసనూరి లింగనా మా
త్య పౌత్ర గంగన మంత్రి పుత్ర కాశ్యప గోత్ర
పవిత్ర వజ్రకంకట విశంకటమతి వేంకటపతి
కవి ప్రణీతంబైన విష్ణుమాయా విలాసం-
బను శృంగార ప్రబంధంబు నందు
ద్వి తీ యా శ్వా స ము
సంపూర్ణము.

